తోపేతంబుగ డాకినీసముదయం బుప్పొంగుచు న్నర్తన
వ్యాపారంబులఁ దోఁచుచూపఁ జెలఁగెన్ వ్యక్తస్వరూపంబునన్. ౩౨

ఉ. అంతఁ బ్రసన్నయై నిలిచి యాత్రిశరణ్యని నిన్ను మెచ్చితిం
జింతితమైన కార్య *మిదె చేకుఱ నిచ్చెద వేఁడు మన్న భూ
కాంతుఁడు మ్రొక్కి నీకుకృప గల్గిన నేమి కొఱంత నేఁడు నా
కింతియ చాలు మర్త్యబలి యెన్నఁడుఁ గోరక పూజ లొందుమా. ౩౩

మ. అని ప్రార్థింపఁగఁ బూజకుం దు నట దివ్యాకారుఁడై యంబరం
బున భాసిల్లుచు నిల్చి ఖేచరుఁడఁ †గర్వారాంగుఁడ న్నేఁ గుబే
రుని శాపంబున సుక్తి యీగతి నతిక్రాంతుండనై యిప్పుడో
జననాథా భవదాగమంబు కలిమి న్పాపావధిం బొందితిన్. ౩౪

క. నావుడు వెఱఁ గందుచు నీ, కేః ధమున శాప ‡మయ్యె నీకథ తెలియం
గా వినిపింపుము మాకని, భూవల్లభుఁ డనఁగ దివ్యపురుషుఁడు నల్లెన్. ౩౫

గీ. ధనదు దేవపూజ కనువగు క్రొవ్విరు, లెచట నైనఁ గోసి యేన తెత్తుఁ
×దెల్లవాలు విరులు దే నొకనాఁ డేగి, మధువనమున నొక్కమగువఁ గంటి.

క. అన్నెలఁతుక యెదురను సుర, పొన్నలు గోయంగ వచ్చి పుష్పాయుధుచే
నున్న నెఱవాదియమ్ములఁ, గన్నుల నగుచున్న చెలియకడకుం జనియెన్.

క. అట చని మదిసమ్మదము, త్తటముగ సఖఁ గౌఁగిలించి కానఁగరావో
విటవంచని (యిన్నిదినము, లెట పోయితి వనిన నదియు నిట్లని పలికెన్.

క. రతిలంపటుఁడును శృంగా, రతిలకుఁడు నసఁగ పటులు రసికత్వమునన్
క్షితిఁ దిరుగుచు §నావెరవ, న్నతముగ వినినన్నుఁ గలువఁ బోనికడంకన్.

క. నాయింటికి నరుదెంచిన, నాయిద్దఱ కేను జందనాగరుకస్తూ
రీయుతముగ నుపచారము, సేయించితిఁ దెక్క[1]రముగఁ జిత్తము లలరన్. ౪౦

వ. తదనంతరంబ వారలు కుసుమంబులుం దాంబూలంబులుఁ బుచ్చుకొని యా
విటవంచనీ నీపేరు నిజంబుగ నెటువంటి విటుల నైన మోసపుత్తు వఁట నిక్కు
వంబే యని యడిగిన. ౪౦

క. కల్లలు నిజములు ధర్మము, నొల్లంబును బ్రియము మోహమును నలుకయు న
య్యుల్లసము నయముఁ బెరుఁగఁ, జెల్లుదు విటయూధ్యులందు దుశ్చరితులందున్.

* * * * *

*మిటు †గర్వార ఖ్యుఁడన్ ‡శాపమబ్బె శాప మొందెను ×కాన కరిగి విరులు దేవొకనాఁ
డిచ్చు- (యిన్నాళ్ళు- §నా పేరు- న్భుత- 1 తేకరముగ-

సీ. మఱియు నొక్కఁడు బ్రాహ్మణుఁ డిటులఁ దనువది నను గోరి చనుదెంచి నాకు నైన
తగులెల్ల విని నన్ను దర్శింప మఱి యుపాయము లేక సురపొన్న లమరఁగట్టి
మూఁడెత్తులుగఁ జేసి మును మాలకరి వోలె నేతెంచి నాచేతి కిచ్చి నంత
నిరుదెసలందున్న యిద్దఱ కొసఁగి యం దొక్కటి నేఁ గొన నుత్సహించి
యందుఁ దేనె గ్రోలు నళిఁ జూచి యిదియును
ఋణము సౌఖ్యమొందఁ గాక యంచు
ముడిచికొనక దండఁ దొడమీఁద నిడుకొంటిఁ
గ్రొత్తవాని కియ్యకోలు గాఁగ. ౪౮

వ తరువాత వానికిఁ బసిండిటంకం బిప్పించి సంచిలోఁ బడినయప్పుడు గాని యిది దక్కదని పలికి యాతుమ్మెద ప్రియుని చెవకుంచు మూగవని యొద్దిసురపొన్నమీఁద విడిచిపోవుని వీడుకొలిపిన వాఁడును నట్లు చేయుచుంజని మత్సమాగమంబునకుఁ బ్రత్యుపచారంబులు సేయుచు నెఱజాణయగుటం జేసి.

ఉ. నిష్కము సంచిలోఁ బడుట నీరజమిత్రుఁడు గ్రుంకు వేళఁగాఁ
బుష్కరనేత్ర చెప్పె నళి పొన్నపయి న్విడుమంట లోనికిన్
నుష్కరవృత్తి గా దదియు ద్రోవ చుమీ యని చూపు టయ్యె నే
శుష్కవిచారము ల్వలను సూర్యుఁడు గ్రుంకిన నంద యేగదన్. ౪౯

క. అని నిశ్చయించుకొను నెడ, వనజాప్తుఁడు నిష్పుమూర్ధ్ని వారిధిలోన
న్మునుఁగఁగ నెగసిన పొగ క్రియ, ఘనముగఁ దిమిరంబు దిశలఁగనుకనిపర్వెన్.

గీ. అంతఁ బ్రొద్దు వుచ్చి యంధకారంబులోఁ, బొన్న యెక్కివచ్చి పొంచిపొంచి
జగతిమీఁద నొక్కనయ్యపైఁ బురుషుల, నడుమ నిద్రవోవు నన్ను లేపె. ౫౧

* * * * *

వ. పిదపనయ్యిద్దఱం గదలించి యిప్పుడు నాతోడఁ గ్రీడసల్పినవాఁ డెవ్వండు చెప్పుఁడా యనిన వాండ్రు నొండొరులఁ జెప్పకొను తారు గాకుండుట దెలిసికొని *కళవళపడి యిది యేమి చోద్య మని విచారించుచు నుండఁగ, నేను, బగలు వచ్చిన మాలకరి యప్పుడు దెచ్చిన మూఁడెత్తులలో నిరుదెసలనున్న మీకు రెంటి నిచ్చి కడమ నాకొసంగిన దండయందుఁ దుమ్మెద సుఖయించునని మ్మని తొడమీఁద నిడుకొనిన భావంబు మీ రెఱుంగరైతిరి.

క. ఆరసికుఁ డెఱిఁగి వచ్చిన, నీరీతుల నడుమఁ గలిసి యొక్కటఁడఁగ మా
†చీరలువీడ్వటిచితిమి విచారింపఁగ నేల నాదు జయ మాఁ గాదో. ౫౨

*తక్కులపడి †చీరలు వీడ్వడఁగట్టిన, సాదృశ్యం బిదియు వాదుజయ.

క. వావ్రము వనితలనెవ్వఁడు, గావంగా నోపు మాంత్రికార ముఖులకు
న్నీ వెఱఁగింపకు మని లజ్జావనతముఖాబ్జులగుచు వఱిగిరి చెలియా. ౫౭

ఉ. విన్నటిరాత్రి యూరకుయు నీగతి నిచ్చట నిద్రయించుచు
బొన్నలు గోయవచ్చితి నపూర్వపుఁబంతము వింటివే యనం
బ్రన్నన నవ్వి యీకొలఁది పంతము లెవ్వరుఁ జేయ రివ్వెలో
విన్నిఁటఁ గాముకు ల్గెలువనేర్తు రె యంచు నుతించి బోటియున్. ౫౮

గీ. ఇట్టిగోష్ఠివినుచు నేను గూఢంబుగాఁ, దరువుమీఁదఁ బెద్దతడవు నిలిచి
విరులుగోసికొంచునరిగెనుసంతలో, విభునిదేవపూజ వేళ దప్పె. ౫౯

చ. అలుకుచు నేగ నాతఁడు శివార్చనవంచక మాల్యవర్తిటి
న్నిలిచి దినంబు మానవుల నెత్తురుద్రావెడి శోణితప్రియుం
గొలిచి మనుష్యహంత వయి కోవెలలోపల నుండుమంచు న
న్నలిగి శపించె నీశ్వరనిరాకరణం బిది చిత్రమో ప్రునే. ౬౦

వ. అపుడు వడవడ వడంకుచు నేనపరాధి నైతిని బుద్ధ్యకార్యంబు వదలి దుర్గోష్ఠి విన్నదానికి ఫలం బిపుడి ట్లయ్యె దేవర యానతి తప్పునా నాకెన్నండు శాపావధి యానతి మ్మని మ్రొక్కిన భవసఖుండు గొంత ప్రసన్నుండై నీ వా దేవతం గొలిచి తత్ప్రియ నుండఁగ నెప్పుడే నొకవీరుఁడు నరబలి మానిపింపం దాఁ జేయవయ్యేని నప్పుడా దేవిచేత శస్త్రహతిని శాపముక్తుండవు గమ్ము పొమ్మనిన- ౬౧

క. ఖేచరభావం బుడిగి వ, నేచరభావమున నిట్లు నిచ్చలు జనుల
న్నీచుఁడనై వధియించుచు, నీచేతం బూర్వపదము నేఁడిదె కంటిన్. ౬౨

మ. అనుచుం జెప్పి కుబేరకింకరుఁడు దా నాకాశమార్గంబునం
జనియెం గ్రమ్మఱ శోణితప్రియయు నాత్మోపాలు నగ్గించి నీ
మనమార న్నరు గోఁనట్టికొలఁది న్మర్త్యోపహారంబు నై
కొను టే మానితి నూరి కేగు మని వీడ్కొల్పెం బ్రసన్నాత్మయై. ౬౩

వ. తదనంతరంబ- ౬౪

ఉ. దేశతఁ బోఁచిదిన్ జనులఁ దింటయు మాన్పితి యక్షభృత్యు న
ద్భావము నొందఁ జేసితి ముదం బిట చేకుఱె నంచు నీటి కు
ర్వీవరుఁ డేగుదెంచ నిఁక వింటివె వేగమ నీవు నిట్టికిం
బోవుట మే లనంగ విని †భోజనృపాలుఁడు క్రమ్మఱె న్వసన్. ౬౫

†భోజుఁడు క్రమ్మఱి నేగ లోనికిన్.

—। ఇరువదితొమ్మిదవబొమ్మకథ ।—

క. అంభోధిశయను గమలా,రంభోగ్రాహు నబ్జసంభవగురునిన్
జంభారివినుతగుణసం,రంభాటోపాంధహారకరాళజ్వాలిన్. ౬౬

మ. తనచిత్తాబ్జములోఁ దలంచి మఱియుం ధాత్రీశుఁ డా పాకశా
సనుసింహాసన మెక్కవచ్చిన సముత్సాహంబు వారించి కాం
చనపాంచాలిక నవ్వ దానగుణవిస్తారంబున న్సాహసాం
కుని సాదృశ్యము నొందలేక యిది నీకుం జెల్లునే పార్థివా. ౬౭

క. ఆతనిదానము భువన,ఖ్యాతము సకలోపకారకారణము దయా
చాతుర్య*తుర్యనిధను,త్యాతతధనకనకసముదయాకరము భువిన్. ౬౮

క. త్యాగంబున స్ఫూర్తియు, యోగంబున ముక్తిపదవియు నుచితం బగును
ద్యోగంబున సంపదయును, భోగంబున సుందరియును బొందినఁగూడున్.

క. అనుచును ద్యాగము యోగం,బును నుద్యోగంబు నిష్టభోగంబును బెం
పొనగూడఁ దగినకాలం,బున జరపును నవ్విభుండు భువి యేలంగన్. ౭౦

చ. ఉరగము లెల్ల శేషులు పయోనిధు లెల్ల సుధాబ్ధు లేఱు లం
బరనదు లద్రు లారజతపర్వతముల్ గ్రహము లుసుధాకరు
ల్తరువులు కల్పవృక్షములు దైవతసంఘము లన్నియు న్మహే
శ్వరు లనఁ జెల్లె నెల్లెడల †సాహసభూవరుకీర్తివర్తనన్. ౭౧

ఉ. అట్టిదినంబుల న్నృపులు నాశ్రితులుం గవితారసజ్ఞులుం
జుట్టలు మంత్రులుం దొరలు శూరులు వీరులుఁ గొల్చియుండఁగా
దిట్టతనంపుఁబ్రౌఢ యనఁ దేఁకువ క్కొకవిదేశవస్త్రి యా
బట్టొకఁ డేగుదెంచి జనపాలశిఖామణిఁ గాంచి పెల్లుగన్. ౭౨

సీ. బ్రహ్మోయు వని రాజుఁ బ్రస్తుతిచేసి తదాజ్ఞ సుఖాసీనుఁ డై భజించి
కవితయు సర్వలక్షణపరిజ్ఞానంబు సత్యవాదమును ధీచాతురియును
జాగంబు శౌర్యంబు సరసోక్తియును నాఁగ నియ్యెడుగుణముల నెన్నఁబడ్డ
చండపుత్రుండఁ బ్రచండవాచాలుండఁ జండపురాణదీక్షాగురుండ
నవనిపాలు రెల్ల నరిగాఁపులట్ల నా, కిచ్చుధనము లెల్ల నియ్యకొనుచు
నుత్సవమునఁదిరుగుచుండి యీజగములో, నినుమహాప్రదాతయనఁగవింటి.

*చాతుర్యనిధికమదియ, †సాహసభూవరుఁ దుర్వి యేలఁగన్.

సీ. సత్కీర్తి సతికిని సత్పుత్త్రిలోపల భువనత్రయంబును బొదలుచుండు
గావున నింతకు నీవె తండ్రివి నీదుధనము యాచకులకుఁ దల్లి సుమ్ము
తమపితృధనము లేతఱినైనఁ గైకొన్న నిది భాగ మని భువి నెన్నఁబడునె
తనకుటుంబముఁ బ్రోవఁదా నెంత ప్రియపడ్డ నతఁడు మహోదారుఁ డనఁగఁ దగునె
తగదుగాని నీయుదారత్వమే నుని, పొగడవచ్చుఁ *దొంటిరంతుపొంటెఁదలఁప
శమితకుజనతర్క జయరమాసంపర్క, విమలకైరవార్క విక్రమార్క. ౨౪
క. జలములు పైఁబడక మహా,నల మాఱకు శౌర్యభూషణా నీకోపా
నలము రిపుసతులకన్నుల, జలములు గనియాఱు నెంతసత్వం బిచటన్. ౨౫
క. కావున యశముఁ బ్రతాపము, నీవిరవునఁ బొగడఁజెల్లు నెవ్వరి సరిగాఁ
గావింపవచ్చు దీనులఁ, గావం బ్రోవంగ నీవె కారణ మగుటన్. ౨౬
ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
నేవసుధేశు నీయెదుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వ ల
జ్జావశ మై చలింప దిఁక సద్గుణముందఱ సద్గుణాఢ్యుఁ బ్ర
స్తావన చేయనేరనియతం డతిమూఢుఁడు గానఁ జెప్పెదన్. ౨౭
గీ. విపులదుర్గ మైన వింధ్యపర్వతసీమఁ, జంద్రకాంతసౌధజాలరుచుల
రాజపురము తోడ రాజిలుచు నుంచిన, రత్నపురమునాఁ బురంబు గలదు ౨౮
క. ఒకటొకటికంటెఁ బొడవునఁ, బ్రకటముగా స్ఫటికహర్మ్యపంక్తులు దివి ము
ట్టి కలశభవుచే వింధ్యా, ద్రికిఁ గ్రృతమున నైన కొఱఁతఁ దీర్చుచునుండున్.
క. అందు జయసేనుఁ డనఁగఁ బు, రందరవైభవుఁడు †రాజరాజసనాథ్యుం
డిందుధరభక్తినిరతుఁడు, వందిజనప్రియుఁడు మనుజవల్లభుఁ డుండున్. ౩౦
క. ఆనరనాయకు వేఁడిన, దీనులు ధనవంతు లగుదు దేశములోన
న్నానవనాథులక్రియ నతి,దానంబులఁ బరఁగుదురు ప్రదాతలనంగన్. ౩౧
సీ. అట్టివిజయసేనుఁ డధికసంపత్తితో నొకనాఁడు నవవసంతోత్సవంబు
సేయ నుద్యోగించె నాయవసరమునఁ గవులును భట్టును గాయకులును
నర్తకులును నిజకీర్తి నుతించుచు సరసభావంబున సరస నడువఁ
జెలువార వారకాంతలు సుగంధద్రవ్యహస్తలై కేలఁకుల నరుగుదేర
దొరలు లెంకలు హితులు మంత్రులును గొలువ, నశ్వరత్నము నెక్కియు నుద్యానభూమి
కేగి యచ్చట కొకపొదరింటి క్రేవ, సుఖచిరంబుగ మాకందతరువుక్రింద. ౩౨

* తొంటిపొందెరలఁప. † రాజరాజసనాథ్యం.

శా. అర్పింపందగు పూజలెల్లఁ దగుమర్యాద స్సమర్పించి కం
దర్పం దర్పిప్రియమిత్రుని స్సముచితోత్సాహంబునం గొల్చి యే
కార్పణ్యంబును లేక యింపెసయఁగాఁ గాశ్మీరకస్తూరికా
కర్పూరాదివసంతఖేలనములుం గావించె నుల్లాసి యై. ౮౩

క. జనవరుఁ డయ్యుత్సవమున, మనములరఁగ యాచకులకు మాడలు పదివే
లును దొమ్మిదిలక్షలు గ్రక్కునవిచ్చెఁ గీర్తి దిశలఁ గొనసాఁగంగన్. ౮౪

వ. అసమయంబున- ౮౫

ఉ. యాచకకల్పభూజ మగు నానరనాథు సహోదరాన్వయుం
జూచితి వానిచేత నిలు చూఱలు గొన్నకతి స్సువస్తువు
ల్వాచతురత్వదిహ్యములు నాఁగయికొంటి సతంబు ధాత్రిలో
రాచగొనంబులం బసఁగురా జపుఁ గావున నెన్న నొప్పగున్. ౮౬

ఉ. అంచు నతండు రత్నపుఁ యందలి మండలనాథచంద్రు వ
ర్ణించిన నయ్యవంతిధరణీధరుఁ డాతని చాగ మాత్మలోఁ
గొంచెముగాఁ దలంచి *నిజకోశగృహాధిపుఁ డైన లెంక నీ
క్షించి యనంతదానగుణశీలసమగ్రత †నత్యుదారుఁడై. ౮౭

చ. ఇతని కనర్ఘరత్నములయింపులుఁ గాంచనమందిరంబులుం
జతురతురంగసద్మములు సామజశాలలు నూపురాద్యలం
కృతిసదనంబులు న్వసనగేహములుం బరిపాటిఁజూపు న
మ్మత మగువస్తుజాతము సమస్తమునుం గొనిపోవని మ్మటన్. ౮౮

క. అనవుఁడు భాండాగారికుఁ, డును విస్మయమందుచుం గడుం బ్రియ మడరం
దనలోన వెఱఁగుపడ నా, తనిఁదోడ్కొని యరిగి వరుసఁ దద్గృహములలోన్.

వ. మదశుకానుకృతంబు లగు మరకతంబులు ను, బరిపుష్పరాగంబు లగు పుష్పరాగంబులు ను, ధామాధికంబు లగు గోమేధికంబులు ను, ప్రభాసఫలంబు లగు ముక్తాఫలంబులును, విడంబితబాలప్రవాళంబు లగు ప్రవాళంబులును, నదృష్టవైదూర్యంబు లగు వైదూర్యంబులును, యమునానీరనీలంబు లగు నీలంబులును, రుచిరజితవజ్రంబు లగు వజ్రంబులును, గల్పితపద్మరాగంబు లగు పద్మరాగంబులును, నవధీరితమేరుశిఖరంబు లగు కనకశిఖరంబులు ను, నధరీకృతార్ణవాజు లగు తేజులు ను, నుపమితదిగ్గజంబు లగు

*నిజకోశస్థితుఁ డైన- †నత్యుదగ్రుఁడై.

మత్తగజంబులు ను, గర్ణికారసువర్ణాకారంబు లగు సువర్ణాలంకారంబులును, నానాంశుకంబు లగు చీనాంశుకంబులు ను, గనుపట్టం జూపిన నవ్వందివరుండు నివ్వెఱఁగంది తత్త్యాగసంపదలకుం గంపితశిరస్కుం డై యుండుం దన కావటం బగువానిం గొనిపోవం దలంచి. ౯౦

క. అనుచరులచేత మణులును, గనకము మూటలుగఁ దృణ్ణఁ గట్టించి నృపా
లుని గర్ణుని మీఱితి వని, కొనియాడుచు నర్థ మెల్లఁ గొనుచుం జనియెన్.

ఉ. ఆతఁడు చన్నపిమ్మటఁ దదర్థగృహస్థితుఁ డైన లెంక సం
ప్రీతమనస్కుఁ డై నృపుని పెంపు మనంబున సన్నుతించుచు
న్నీతియు భీతియుం గలుగ నేరుపు చొప్పడ విన్నవించె న
త్యాతత మైన యాజ్ఞ వినయంబునఁ జేతులు మోడ్చి నమ్రుఁ డై ౯౨

క. తనియంగఁ బట్టుకొనిపో, యినయర్థము కొలఁది మీకు నెఱుఁగఁగవలయు
న్వినిపించెద నవుడు నమ్మనుజేంద్రుఁడు చులుకఁ జూచి మందస్మితుఁ డై.

క. చనువాఁ డని నే నిచ్చిన, చనవునఁ గొని చన్నధనము సంఖ్య యెఱుఁగం
బని లే దిఁక నాయర్థము, కొనియేగినవాఁడె యెఱిఁగికొన్నం జాలున్. ౯౪

సీ. అనుడు నాలెంకయు నాశ్చర్యమందుచు ధరణీశ నీకు నుదారమతికి
నిప్పటియానతి యొప్పు న ట్లయ్యును బలికెద నా విన్నపంబు వినుము
పయిలెక్కకాండ్రను గయికొల్పి వెలయించి లెంక విశ్వాసంబు బొంకు చేసి
ధన మెంత గల్గినఁ దాఁ జుల్కఁ జూడక యాయవ్యయంబుల నడుగవలయు
వాని వివర మెల్ల వర్గువుగాఁ గూర్చి, నెఱయఁ దెలుపు లెక్క లెఱుఁగుకొనుచు
వ్యయము పుచ్చి నిలువ వ్రాయించికైకొంట, ప్రభుల కిదియ నీతివిభవమండ్రు.

గీ. వ్రాఁతకాని నమ్మరా దర్థగృహముల, నుంచకున్న నేమి యొక్కనాఁడె
వెరసు గూడుమనినఁ గరణము పండిత, న్యాయమునఁ గనర్థముచటఁ దెచ్చు.

క. ఒకదెసఁ దెచ్చిన యాయం, బొకదిక్కునఁ జెల్లువ్రాసి యొకదెసవ్యయ మ
ట్లొకదిక్కునఁ జనవ్రాసినఁ, బ్రకటంబుగ వాఁడు మిగులఁ బాపాత్ముఁ డగున్.

క. వహి వారణాసి యనఁగా, మహిఁ బరఁగిన దిందుఁ గపటమార్గంబుగ నా
గ్రహమున వ్రాసినవానికి, నిహపరములు లేవు నరక మెదురై యుండున్.

గీ. రానిపైఁడి చెల్లువ్రాయుట యాయంబు, తక్కువైన వ్యయం బదెక్కుడౌట
లెక్క తుదుపువడుట లిపి సందియం బౌట, చెల్లు మఱచుటయును గల్లతనులు.

వ. దేవ నీయానతి కనుగుణంబుగ సమూల్యరత్నాది సువస్తువు లెల్లను దాఁ పురంబు చేయక చూపిన నతిం డు నేఁ డిచ్చె కొలందిని యపారితంబుగా నింతధనంబు గొని చనియె నని మిక్కిలి సంతసిల్లి నవ్వుచు నాలెంకకు లక్షధనంబు కనదనం బొసంగెఁ గావున ౧౦౯

క. నీకంత యీవి గలుగక, యీకడ నను గినఁ దరంబె యేగు మనిన నా
భూకాంతునిగుణము లుపశ్లోకింపుచు నృపునకు మగిడి లోనికిఁ జనియెన్.

—॥ ముప్పదియవబొమ్మకథ ॥—

వ. మఱియు నొక్కశుభావసరంబున. ౧౧౦

క. నెఱయ మగతనము గలిగియు, నొఱపుగ జగములకు దల్లియుం దండ్రియు నా
నెఱుకపడనొప్పమేనను, దెఱవయు మగవాఁడు నైన దేవరఁ దలఁతున్.

మ. అనుచు న్భోజనరేశ్వరుండు మఱియు న్సత్కంబున న్రత్నకీ
లనరమ్యం బగు నమ్మహాసనముపై లక్ష్మీకళాసుందరా
ననుఁడై పాదసరోరుహం బిడు నెడ న్వారించి యాపొంత కాం
చనపాంచాలిక యిట్లను న్సరసవాచాలత్వ మేపారఁగన్. ౧౧౩

ఉ. భోజనరేశ్వరా మగిడి పోయెద వెప్పటి యట్ల క్రమ్మఱన్
రాజసవృత్తి నెక్క ననురాగము గైకొని వచ్చె దింతటం
దేజము గల్గునే పసుమతిం బ్రతి లేని వదాన్యవృత్తి మా
రాజగు విక్రమార్కు సరిగాక పదం బిడఁ జెల్ల దేరికిన్. ౧౧౪

క. అతని వదాన్యత్వము విన,మతిఁ బ్రియ మగు నేని వినుము *మందారముసం
తతదానశాలియనఁ దగు, నతనికి సరిరాక వెలుకనై తలవాంచెన్. ౧౧౫

ఉ దండితశత్రుమండలుఁడు దానగుణార్థసుతుండు వైభవా
ఖండలుఁ డార్తరక్షణనికామసముద్యతమానసుండు మా
ర్తాండసమానతేజుఁడు ప్రతాపసమగ్రభుజుండు మేదినీ
మండల మెల్ల నేలె గరిమంబున నబ్దులు నాల్గు మేరగన్. ౧౧౬

క. సాహసభూషణుఁ డొకనాఁ, డీహితమునఁ దలఁచి నిశ్చయించి కలిమిచే
నైహికసుఖమగు ధర్మో,త్సాహమునఁ బరోక్షసుఖము సమకూరఁదగున్.

క. ఈరాజ్యంబున కిటుసఁ,పారసుఖం బొదవె జన్మసాఫల్యముగా
నేరీతి నైన ధర్మా,చారంబున నొందవలయు స్వర్గసుఖంబున్. ౧౧౭

---

*మందారము సం, తతమును సంతానముఁ దా, నతనికి,

మ. అనుచుం గల్పితనిశ్చయుం డగు నరేంద్రాగ్రణి చిత్తంబు వ
ర్తన మూహించి తదీయసన్మతికి నుత్సాహంబు రెట్టింప నా
య్యనఁ దన్మంత్రివరుండు నన్నై నిరపాయస్వర్గసౌఖ్యంబు ని
కనుమానం బగునే యనంతసుకృతవ్యాపారసంచారికిన్. ౧౧౯

సీ. అతిథిసత్కారంబు నార్తరక్షణమును దానంబు దయయు సత్యవ్రతంబు
తఱచుగాఁ జేసినధర్మంబు తనతోడి నీడయై చనుదెంచుఁ దోడుగాఁగఁ
జిత్తంబు నానాఁటి చింతనూరకమున్న ప్రాణ్యసంపదలు పెంపఱకమున్న
ముదిమిచే సంధులు వదలకమున్న రోగంబున నొక్కకీడుఁ గాకమున్న
పుణ్యమార్జింపుఁ డవసరంబునకు మొదల
గట్టియారాధనములు కూడఁబెట్టుఁ డంత్రు
జీవ మెడలంగ సుకృత మార్జింపఁజనుట
నిల్లు గాలంగ నుయి త్రవ్వనేగు టండ్రు. ౧౨౦

క. ఈవచనం బితరులకొఱకై వినిపింపంగవలయు నది నీకడ స్వా
భావిక మైనది గావున, నీవెఱుఁగవె యుక్తి ధర్మనిరతులు గలవే. ౧౨౧

క. నావుడుఁ గను మదినుత్సుకుఁడై విప్రులయుంక్లృప్తులునర్థమువనముల్
బావులు నూతులుఁ జెఱువులు, దేవస్థానములు నిలిపెఁ దేఁకువ కెక్కన్. ౧౨౨

ఉ. ఎక్కడఁ జూచినన్ సుకృత మిన్నిక కెక్కఁగఁ గీర్తిసంపద
లెక్కువిధంబులన్ ధరణిఁ బెంపు వహింపఁగ నానరేశ్వరుం
డొక్కఁడె తీర్థసేవనసముత్సుకుఁడై పరివార మెల్లన
ద్దిక్కులయందుఁ గొల్చి చనుదేరఁగ నర్మద కేగె సొంపుగన్. ౧౨౩

చ. కరితురగాదిసైన్యపరికల్పితమార్గనివేశుఁ డేచు ద
వ్వరిగి యవంతినాథుఁడు నిరంతరవారివిహారశీలసుం
దరతరరాజహంససముదాయసమూహితశర్మద న్నిజ
స్మరణనివారితోన్నదభుజంగమనర్మదఁ గాంచె నర్మదన్. ౧౨౪

క. కనుఁగొని కడుఁ బ్రియమాన నెమ్మనమునఁ బ్రణమిల్లి యచటిమాంధాతృపురం
బున విడిసి యనుచరులుఁ దా, నును నదికిం జని యొనిజమనోరథములరన్. ౧౨౫

మ. చనియాతీర్థములో సచేలముగ సుస్నానంబు గావించి నూ
తనవస్త్రాభరణానులేపముల గాత్రం బుజ్జ్వలస్ఫూర్తి గై
కొని రాజిల్లఁగ నిల్చి విప్రవరులన్ గోభూతిలార్థాది దా
ననిరూఢిం దనిపె న్రవిగ్రహణపుణ్యంబైన కాలంబునన్. ౧౨౬

క. నావిని యొకలన యాతని, చావున కతిఖిన్నుఁ డైన జనపతి కృపతో
నో వీరభటు జనకుని, కైవడి నిను బ్రోతు నిన్నుఁ గడఁగకు మనియెన్. ౧౪౫

క. ఇది చాగెను గొఱకై నీ, పదములకడ నుంచె నిన్ను పతిపోయిన న
త్పదమున కేగెద ననుపుట, మది జూడఁగ నిది యె తంత్రమున్నన గాదే.

ఉ. ఆకులపాటుతోడ నసుభాక్కృతి యై యొక వేళ నైనఁ బోఁ
గాకున తేక సొమ్ములకు నష్టులు పాఁపక పేరఁటంబులం
బోక తొలంగి పూఁతలును బువ్వులు దూరముగాఁగ ముండయై
యేకడఁ జేరిన న్విధవ కెట్టుల కాక †తరింపవచ్చునే ౧౪౭

క. చచ్చియుఁ జావక తనలో, నెచ్చుచు నియమముల నిరక విధవాత్వమున
న్నిచ్చలు మాఁడుటకంటెను, జచ్చుటకుట మేలు సతికి క్షితి మెచ్చఁగన్.

క. పతి దుఃఖితుఁ డైనను దా, నతిదుఃఖిత యగుచు మాని కతఁ డరిగినఁ బీ
డిత యగుచు నతఁడు నచ్చిన, ధృతితోడన నచ్చునది పతివ్రత యుర్విన్. ౧౪౯

గీ. పుట్టలోనిపాముఁ బట్టు గారడికుండు, బలిమి వెడలఁ దిగిచు పగిది నింతి
తోడఁ జచ్చి పతి యధోగతుఁ డైనఁ దా, నుద్ధరించి సౌఖ్యమొందుచుండు.

గీ. అతని కేమికొఱఁత పతి హితంబునఁ బ్రాణ, మిచ్చినాఁడు దివికి నేగినాఁడు
రమణుఁ డగుచు నచట ‡రంభాదిసతులఁ గూ, డ్రానకయున్న నను గూడ ననుపు.

గీ. ఉరక మాన్పి తేని నురివెట్టుకొనియొండె, గుండు గట్టి నీళ్లఁ గూలి యొండె
విషముద్రావి యొండె విడుతుఁ బ్రాణంబు లా, తగవిచార కీనుదగులు నిన్ను.

సీ. §అటుగాక పుణ్యమా నగ్నిప్రవేశంబు చేయింపు మా కిసుచెంద దింక
నెన్న ముక్కోటియు నేఁబదిలక్షలు మానవు మేన రోమంబు లుండు
నన్ని యేఁడులు స్వర్గ మా నాయకుతోడ ననుగతయా సతి యనుభవించు
నీకు విధూల నై విధవ నై యుండుట సముచితం బది గాదు చాగనిమ్ము
తడయ నేల యనుచుఁ దరుణి ప్రార్థించిన, మాఱు వలుక లేక మనుజవిభుఁడు
కొంత యనుమతింప నాతలోఁ దజ్జను, లాయితంబు చేసి రా స్తలమున.

చ. ధృతి మతిఁ బొంగి రాజునకు దీవన లిచ్చి నిజాధినాథు మే
నితమకలం దదస్త్రములు నించి ఘృతప్లుత చందనేంధనా
న్వితమగు వహ్నికుండమున నింతి యెసన్నవనీతపుత్రికా
కృతిఁ బడి యంతలోనఁ గరఁగెన్ జనులం దఱుఁ బ్రస్తుతింపఁగాన్. ౧౫౪

* అవీరభటుని చావునకై † చరింపవచ్చునే, భరింపవచ్చునే, ధరింపవచ్చునే.
‡ రంభాదిసతులను గూడకుండ- రంభాదులను గూడుకొనక యున్న- § అటుగాన యుక్తమా.

వ. తదనంతరంబ. ౧౫౫

క. వసుధేశుఁడు వెఱఁగందఁగ, వెస నరిగయు వాలు ద్రించు విలసిల్లఁగ నా
కసమున డిగి యక్షీరుఁడు, కసుగందకవచ్చి తొంటిరైవడి నిలిచెన్. ౧౫౬

ఉ. ఒక్కఁడు నిల్లు వచ్చి విన యోక్కులు మున్నుగ మన్ను తేనికిన్
మ్రొక్కి సురప్రహూనముల మోహనమా నొకదండ యిచ్చి నే
నక్కడ కేగి దానవుల నందఱఁ ద్రోలినఁ జూచి మెచ్చుగా
నిక్కుసుమస్రజంబు దివిజేంద్రుఁడు నా కొసఁగెం బ్రియంబునన్. ౧౫౭

క. క్రమమున నయ్యింద్రుఁడు నా, కమరపదం బొసఁగి నిజసభాంతరమున ని
త్యమును డఁగవలయుఁగటుం, బముఁదోఁక్కి సరస్ముటంచుఁబనిచె న్నగుడన్.

క. ఆ రణమునఁ గ్రమ్మఱ, నీకడ కరుదెంచినాఁడ నిఁక నేగెద నే
నీకప్పగించి పోయిన, నాకోమలి నిచ్చి మగుడ నన్ననుపు నృపా. ౧౫౯

చ. అనవుడుఁ గొల్వులో నిజను లందఱు మిక్కిలి చోద్యమందఁ గా
మనుజవరుండు వాని కొకమాటయు నాడఁగ తావు లేక వి
న్నన యగుచున్న మంత్రులు మనంబున విస్మితులయ్యు వీరుఁడా
యని మొన నీవు దీఱిన మృగాక్షియుఁ జచ్చుటికొం బ్రియఁబునన్. ౧౬౦

మ. అనిన న్వారలఁ జూచి వాఁడు దివి నే నాదేవసంఘమ్ములు
న్ననుఁ జూడ న్నిపుసీనలం బఱపి మందారస్రజం బింద్రు మ
న్ననగాఁ గైకొని వచ్చినాఁడ నిట నున్నాఁడ న్ననుం దీఱినాఁ
డనిన న్తెత్తు రె రాచవారలకుఁ గల్లాడ న్ననం బొందునే. ౧౬౧

క. ప్రత్యక్షముగా నెదుర ను, సత్యము వలుకుదురు గాక చనువారు హితా
మాత్యులు నైమిారీతని, కృత్యము నడుపుదురు మిమ్ము గెలువం దరమే.

చ. అనుడు నిరుత్తరుం డగుచు నవ్వసుధేశుఁడు వానికంత నా
యనిమిష నాథునొండె మఱి యంతకునైనఁ గలంచి తెత్తు నేఁ
డని మది నిశ్చయించుకొని యాత్మహితుం డగు లెంకచేతి కాం
చనమయముష్టిరమ్య మగు శస్త్రిక యల్లన యందె నందినన్. ౧౬౩

క. ఆవీరుం డప్పుడె నిజభావము ప్రకటముగ నాత్మభామినితోడం
దా వైతాళికుఁ డగుచుం, గైవారము సేసె జనులు గడు వెఱఁగందన్.

క. నరనాథ నిన్ను నపు డవ,సర మడిగినవాఁడ నైంద్రజాలికురీతి
న్నరుల నణకించి నీచే, సిరి వొందం జోద్యమిట్లు చేసితి ననిమోన్.

గీ. అనుచు వెఱఁగు పడుచు నవనీశుఁ డంతయు, నింద్రజాలమగుట యెఱిఁగి యతని
గారవించి యెన్నికళ లభ్యసించితి, వన్ని నాకుఁ జెప్పు మనుచు నతఁడు.

గీ. పెక్కువిద్యలెఱుఁగఁ బృథ్వీశ వినుఁ గొల్ల, నేర్తుఁ గొన్నికళలు నేర్తుఁ దొల్లి
వాని పేళ్లు వినఁగ వలయును జెప్పెద, బాపనైన నన్నుఁ దక్షుఁ డనరె.

వ. కావున నవధరింపుము నాలుగు వేదంబులు ను శిక్షాదిషడంగంబులు ను స్మృతులు ను బురాణంబులు ను బూర్వోత్తరమీమాంసలును న్యాయశాస్త్రంబులు ను నితిహాసంబులు ను వాస్తుశాస్త్రంబు ను శైలతంత్రంబు ను నాయుర్వేదంబును ధనుర్వేదంబును విషప్రతీకారంబును మంత్రప్రతీకారంబును గణితంబును మాంత్రికత్వంబును జలసూత్రంబును సంగీతంబును సాహిత్యంబును సుచిత్రకృత్యంబును నాటకంబులుఁ గావ్యంబులు నలంకారంబులు నానాదేశభాషలు ను సకలలిపిపరిచయంబు ను దూరగమనంబును దూరశ్రవణంబును ధురంధరత్వంబును, వశ్యాకర్షణాదిషట్కర్మంబులును వాహనారోహణచాతురియు జలస్తంభన, శిలాస్తంభన, స్థలస్తంభన, అగ్నిస్తంభన, ఖడ్గస్తంభన, వాయుస్తంభన, రసస్తంభన, శుక్లస్తంభన, రక్తస్తంభనాదులును మహేంద్రజాలంబును, నష్టవస్తుసముద్ధరణంబును, జీవితార్థదానముష్టికరణంబును ప్రియభాషణంబును సదృశ్యీకరణంబును సదృశ్యాకర్షణంబును కృషివాణిజ్యాదులును శకునతత్త్వంబును రత్నగర్భాది పరీక్షణంబును మనుష్యాది జీవపరిరక్షణంబును ద్యూతాదిఖేలనంబును యమనియమాద్యష్టాంగయోగంబును అష్టావధానంబును వైదికంబును లోకాచారంబు ను రతిరహస్యంబు ను వాద్యకౌశలంబు ను నాట్యంబును బరకాయప్రవేశంబును బరవంచనంబును, ఉపాయాపాయవివేకంబును వీరత్వంబును వాచకంబు ను గందుక కుక్కుటాండ జలపూర్ణభాండ చక్రభ్రమణంబు ను బహురూపనటనత్వంబును వేణుదండభ్రమణంబును రాజముఖ మృగముఖ స్త్రీముఖ చోరముఖ దిఙ్ముఖబంధనంబును హాలికప్రయోగంబు నాకారగుప్తియు భావజ్ఞానంబును గ్రామణికత్వంబును లేఖకత్వంబును బరిహాసంబును వాచాలకత్వంబును సిష్టంపవృత్తియు సర్వజాతిశిల్పపరిశీలనంబును నాఁ జతుష్షష్టికళలయందును దేవరసాన్నిధ్యంబునం గొంత పరిచితుండ ననిన.*

క. భూవల్లభుఁ డాతని వి,ద్యావిజ్ఞానంబు మెచ్చి తనలోపల సం
భావింపఁ దలంచునెడన్, దౌవారికుఁ డేగుదెంచి తగ నిట్లనియెన్.

* ఈ వచనంబులోని చతుష్షష్టికళలను - (ఒకతీరు విధముగా మార్పఁబడినవి, సంఖ్య హెచ్చినది.

క. ఓనరనాయక తమకుం, బూనిక ఫలియింపఁ బాండ్యభూపతిమంత్రుల్
కానుకలు గొంచు దేవరఁ, గానం జనుదెంచినారు కడు వినయమునన్. ౧౭౦
గీ. అనిన వారిఁ దోడ్కొనిరమ్ము నావుడు, మగిడి యేగి యచటిమంత్రివరుల
వాఁడు దోడుకొనుచు వచ్చి దర్శింపించెఁ, గనకరత్నచయము మునుముగాఁగ.
సీ. ఆమంత్రివరులు సాష్టాంగంబుగా మ్రొక్కి నిలిచి ముందరఁ గరంబులు మొగిడ్చి
జనలోకనాయక యెనిమిదికోట్లు దీనారములు *నూర్వురు వారసతులు
తొంబదిమూఁడు ముత్యంబులు †కావళ్లు నేఁబదినూఱు కరీంద్రములును
మున్నూఱు జవనాశ్వములును గప్పంబుగాఁ బాండ్యభూపాలుండు పంపెనీకు
నవధరించి దండయాత్ర యుక్కడమాని, యతని గావవలయు ననుచు మ్రొక్కి
‡యున్నఁ గరుణఁ జూచి యుర్వీశ్వరుండును, మోద మడర వారి నాదరించి.
ఉ. అర్థులు గోష్ఠి¶ చేయు సమయంబున వచ్చిన దర్శనంబు న
య్యర్థుల కిచ్చె నేని ప్రభు వాతఁడె కాన విద్యగాని కా
యర్థము ముత్తియంబులు నవాంగనలుం గరులున్ హయంబులుం
బార్థివుఁ డిచ్చి పుచ్చెఁ దను బాండ్యునిమంత్రులు ప్రస్తుతింపఁగన్. ౧౭౩
క. అట్టిమహోదారుఁడు తన, పట్టణమున కేగి రాయబారులఁ గృపఁ జే
పట్టి సిరి నెగడెఁ గావున, నిట్టిగుణము లేక యెక్క నితరులతరమే. ౧౭౪
క. అనవుడు భోజుండును నె, మ్మనమున నవ్వికమార్కు మహనీయము లౌ
గొనములు గొనియాడుచు నె, గ్గనయఁగ నాసొంపుదక్కి యింటికిఁ బోయెన్.
శా. శృంగారాధిపతిత్వసంజనితలక్ష్మీసంగతాంగు న్వియ
ద్గంగాకారణపాదపద్ముని త్రిలోకవ్యాపకుం గోపరూ
పాంగీకారకృతార్థితవ్రజకురంగాక్షీమనోరంగునిన్
సంగీతప్రియు సామవేదమయుఁ గంసధ్వంసి విశ్వంభరున్. ౧౭౬
శా. గంగాతుంగతరంగసంగతజటాకల్పాయమానాకృతిం
ద్వంగద్భోగభుజంగరాజఫణరత్నజ్యోతిరుద్దీప్తసా
రంగాంకద్యుతిధౌతరాజతగిరిం గ్రస్తానరంగస్థలీ
రంగద్భృంగిరిటిప్రసంగసుఖపారంపర్యధుర్యున్ శివున్. ౧౭౭
మాలిని. శశధరశకలాంకా సన్ననోనిష్కళంకా
విశదగిరినివాసీ [1]విశ్వబాధానిరాసీ

---

*దయుకతులు నూఱుగురును †కోవిదులు- ‡విన్నవించుటయును విని యవనీపతి ¶చేయు గోష్ఠులందున- చేయునెడ నప్పుని [1]విశ్వబోధానురాశీ.

దశముఖవరదాతా దైత్యహింసావిధాతా
పశుపతిహరిరూపా ప్రాజ్యపూజ్యస్వరూపా ! ౧౭౮

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలిక భేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూఢ నూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్య పౌత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశికయను కావ్యంబునందు సాహసాంకుని సాహసోపకారంబులును విటవంచని వంచకత్వంబును గర్వారాంగునిశాపమోక్షణంబును విక్రమార్కునౌదార్యంబు నన్నది యేకాదశాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## —॥ ద్వాదశాశ్వాసము. ॥—

క. శ్రీపరిరంభణసమయప్రాపితనవకుంకుమాంకభాసురనిజదే
హోపమితసాంద్రనీరద, రూపు న్సురవిమతనిహితకోపాటోపున్. ౧

చ. హృదయమునం దలంచి ధరణీశుఁడు క్రమ్మఱ నొక్కవేళ నా
త్రిదశవరాసనంబున కతిప్రమదాస్పదమైనరాజ్యసం
పద నరుదేరఁగా నతని భావము గన్గొని యల్ల నవ్వుచుం
దదనుమతంబు మాన్పి విదితంబుగ నచ్చటిబొమ్మ యిట్లనున్. ౨

### —॥ ముప్పదియొకటవబొమ్మకథ ॥—

క. ముప్పదిమాఱులు క్రమ్మఱి యప్పుడ చనుదెంచినాఁడ వాతనికథ లి
ట్లొప్పఁగ దా యిఁకనొకకథ, చెప్పెద నీచేత నీకుఁ జెల్లదు సుమ్మీ. ౩

ఉ. సజ్జనరక్షణోన్నతవిశాలభుజాయుగళుండు సర్వసం
పజ్జితకిన్నరేశ్వరుఁ డపారభటోద్భటవైరిమేదినీ
భృజ్జలజక్షపాకరుఁడు భీమబలాఢ్యుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున గుణోర్జితుఁడై ధర యేలుచుండఁగన్. ౪

క. జననుతుఁడు శాంతిశీలుం, డనఁగా నొకభిక్షుకుండు హరిమూర్తికిఁ దా
నెనయగు భూవల్లభునిం, గనుఁగొనఁ జనుదెంచి ఫలము కానుకయిచ్చెన్.

క. ఇచ్చినఁ గైకొని నృపుఁ డిటు, విచ్చేయుం డనుచు గారవించుచు నతనిన్
సచ్చరితుఁ డనుచు నాసన, మిచ్చి యుచితగోష్ఠి జరపి యెలమిని ననిపెన్.

వ. ఇట్లనిపిన తదనంతరంబున- ౭

గీ. ఆఫలంబు తనగృహాధ్యక్షుచేతికి, నిచ్చి లేచి లోనికేగె విభుఁడు
మఱియు నాతపస్విమఱునాఁడు గ్రొత్తగా, నొక్కపండు దెచ్చియొసఁగెఁబతికి. ౮

శా. ఆపండు న్నృపుఁ డట్లు పుచ్చుకొని భాండాగారిచే నిచ్చి ని
ష్ఠాపార న్ఫలహస్తుఁడై యవసరం బీక్షించుచు న్భిక్షుకుం
*డేప్రొద్దుం గవితావిలాసమున నశ్రాంతము ప్రతీకాశుఁ డా
క్ష్మాపాలుం గొలువంగ నయ్యె దశవర్షంబు ల్వినోదంబుగన్. ౯

---

* దేపారం గవితావిశేషమున లంకేశప్రతీకాశుఁడై.

చ. అటు లోకనాథుఁడు క్రొత్తఫల మాతఁడు దెచ్చినఁ బెంచినట్టి మ
ర్కటమున కిచ్చె నాకపియుఁ గైకొని మూర్కొని చూచి మెచ్చుచుం
గటుకనఁ బండులం గొఱుకఁగా నొకరత్నము గింజమాడ్కి ముం
దటఁ బడియె నిజప్రభలఁ దద్గృహమండప మచ్చుపన్నఁగన్. ౧౦

సీ. ఆరత్న మీక్షించి యాశ్చర్యమున విభుఁ డట గృహాధ్యక్షుఁడై నట్టి లెంకఁ
బిలిపించి యిన్నాళ్ళఫలములు దెచ్చిన్న నెఱిఁగి మాణిక్యంబు లైనవాని
నన్నిటిఁ దెచ్చిన *నాదాఁపుటకు మెచ్చి వానికి నవి యిచ్చి వరుసఁ బిదప
క్షాంతిశీలుం డటు చనుదెంచుటయుఁ జూచి యనఘ నీ విట్టి యనర్ఘమణులు
నాకు నిచ్చి యేమి నాయెడఁ గైకొనఁ దలఁచినాఁడ విపుడు విలువఁ జూడ
నొక్కరత్నమునకు నుర్వియంతయుఁ జాల, దన్నిరత్నములకు నెద్ది యిత్తు. ౧౧

క. అనవుఁడు నాభిక్షుకుఁ డో, జననాయక దీనికంటె సమధికగుణమా
పనిగలదు గాన వచ్చితి, ననఘుఁడ వభయుఁడవు సాహసాంకుఁడ వనఁగన్.

చ. క్షితివర నాప్రియంబు విను కృష్ణచతుర్దశినాఁటిరాత్రి యు
న్నత మగుమఱ్ఱిక్రింద మసనంబున నున్న పిశాచపంక్తి స
న్నుతు లొనరించి హోమము మనోరథసిద్ధికిఁ జేయువాఁడ నే
కతమున నీవు వచ్చుటికిఁ గ్రక్కున రక్షకు నాకుఁ దోడ్పడన్. ౧౩

చ. అనవుఁడు నింతకాలము ప్రయాస మిదేటికి నాఁడె చెప్పినం
బనివిననే యడంచి యొక బ్రహ్మముఁ జేసితి నేఁడు నీవు చె
ప్పిన సమయంబు దప్పక యభీష్టము నీకొనగూర్ప వచ్చెదం
జనుమని వీడుకొల్పి నృపచంద్రుఁడు మానస ముత్సహింపఁగన్. ౧౪

వ. అంతఁ గృష్ణచతుర్దశి వచ్చినం దద్రాత్రి సమయంబున. ౧౫

క. నీలాంకితభూషణములు, నీలాగురులేపనములు నీలాంబరముల్
నీలోత్పలములు నిజదేహాలంకారములు గాఁగ నతఁ డొక్కండున్. ౧౬

సీ. కరవాలహస్తుఁడై పురము వెల్వడి వీరభావంబుతోఁ బూర్వభాగమునను
డాకినీచండతాండవసముద్దండంబు ఘూకఘూత్కారాదిఘోరపదము
సంహృతశవదాహనమయసముజ్జ్వలచ్చటచటధ్వనివహ్నిసంకులంబు
సకుటుంబవృద్ధజంబుకభీషణాక్రోశసంతతబధిరితాశాంతరంబు

*నాదాఁపురమునకు మెచ్చినదానికి నవియిచ్చి శీఘ్ర.

కర్పరాస్థిశూలకంకాళనృకపాల,దారుణంబు భూతకారణంబు
నాగభయరసంబునకు నాస్పదం బైన, యా శ్మశానభూమి కరిగి యచట.

కం. వటతరువుక్రింద నవలో,త్కటమగు గుండంబుపొంతఁ దపసిం గని యే
మట పనివంపుము నాప్రను, భటభావముఁ బొగడి కార్యపరుఁడై యతఁడున్.

వ. ఇచటికిఁ గ్రోశమాత్రమున నొక్కశింశుపావృక్షం బున్నది యందు విలగ్నుం
డగు బేతాళుం డున్నవాఁ డతనిం గొంచు రమ్మతండు మానంబునం గాని
రాఁ డని పంచిన నట చని యనేకవిహంగభుజంగ పిశాచ బ్రహ్మరాక్షస
సతతనివాసం బగు నమ్మహామహీరుహంబు డగ్గఱి తదీయశాఖావసక్తావన
తచరణుండు నవలంబమానహస్తుండు నధోముఖుండు ను నగు నామహాత
ప్రముఖుం జూచి. ౧౯

సీ. తరువెక్కి కాళ్లంతగు లూడ్చ్యనంతలోఁ జేతులుపట్టినం జేతు లూడ్చి
మఱియుఁ గాళ్ళం బట్టి మొఱవెట్ట నాతని మెడమీఁద నిడుకొనిపురము కుఱికి
బాటున కుచిత మౌ పనికిఁ బంపక భిక్షుకుండు పీడఁగుమోసఁగోరెనని చె
ననిదూఱఁగాఁ బిశాచాగ్రేసరుఁడు మీఁదికెగసి యెప్పటియట్లతగిలియుండ
భూవరుండు మోసపోయితి నని తాను, మీఁది కేగి వీఁపుమీఁదఁ బెట్టి
కొనుచు డిగ్గి యేమియు ను బల్క నోడుచుఁ, గదలివచ్చెఁగార్యగౌరవమున.

కం. ఆమెడ బేతాళుఁడు జన,నాయకుఁ బరికించి వేఁడి నరవర భార
వ్యాయామము మఱచి సుఖో,పాయంబునఁ దెరువు జరుగునని కథఁ జెప్పెన్.

వ. అది యెట్లనిన. ౨౨

గీ. అఖిలలోకవిదిత మైన కాశీపురం,బునఁ బ్రతాపముకుటుఁ డనఁగ రాజు
కలఁడు వాని కిష్టకాంత సోమప్రభ, యనఁగఁ గలదు పేరు సార్థముగను.

కం. ఆదంపతులకు సుతుఁడు ప్ర,మోదాకృతిఁ బుట్టి వజ్రముకుటుఁ డనంగా
మేదినిఁ బరఁగుచు నెన్నఁగ, శ్రీదనరారంగ మరుని చెలువు వహించెన్. ౨౪

కం. ఆరాజసుతుఁడు బుద్ధిశ,రీరుండను మంత్రిసుతుఁడు ప్రియసఖుఁడుగ నా
నారూపవినోదముల వి,హారంబులు సలుపుచు న్మహావ్యసనుం డై. ౨౫

ఉ. ఇష్టసఖుండుఁ దా నడవికేగి మృగంబుల వేఁటలాడుచుం
గ్లిష్టశరీరుఁడై కొలని క్రేవ జలార్థము చేరి కన్యకా
సృష్టికి నాద్యలో యనఁదు చెల్వలు*గొల్వఁగఁ దారకాంతర
స్పష్టహిమాంశురేఖ కిది సాటియనం బొడఁగాంచె నొక్కతెన్. ౨౬

---

*గొల్వగ నొప్పు మం గళా, స్పష్టహిమాంశురేఖకిది సాటియనందగు కొమ్మఁ గన్గొనెన్.

చ. అనుపమ బాహులోచనకుచాస్యకళ ల్గొనివచ్చినారు తెం
డని బిసరుహానచక్రనలినాఘము నీళ్ళకు ముంచి వచ్చి శో
ధన మొనరించి చేకొను విధంబున నంబురుహాకరంబు పొం
*తను నిహరించు బాలికయు ధారుణినాథతనూజుఁ జూచినన్. ౨౭

క. ఇరుపురమాపుల మదనుఁడు, శరములుగాఁ జేసి పులకసముదయ మొదవన్
నరి నయ్యిరుపురమనములఁ, గరఁగించె న్ప్రేమరసము గడలుకొనంగన్.

ఉ. అంబురుహాక్షి యప్పుడు ప్రియుంబున నొందలగల్వపూవుఁ గ
ర్ణంబునఁ జేర్చి, దంతశిఖరంబుల ముట్టనచేసి, పాదప
ద్మంబునఁ బెట్టి, వక్షమున దాపి, మనోగతి లక్షణంబు న
క్రంబునఁ దోఁచకుండఁ, జెలికత్తెలు గొంగఁగ నేగ నూరికిన్. ౨౯

క. ఇటనాతఁడుఁ జైత్రము, ముట్టుండు ప్రియంబుతో దమ్ముఁ గొల్వఁగఁ బురికా
దట నరుదెంచియు నొకచెం, గట నుండెం దెలియరాని †కనుబేటమునన్.

వ. ఇట్లా కన్నియ నామగ్రామ జన్మప్రేమాతిశయంబు లెఱుంగమి మిగులఁ బొగు
లుచు దాని తగులు వగల నొగులుచున్న రాజకుమారుం దెలుపకుండుట
బుద్ధిగా దని బుద్ధిశరీరుండు డగ్గఱి నీ కింతచింత యేల విను మాకోమలి తల
మీఁదిఋత్పలంబు కర్ణంబున జేర్చుకొనుట కర్ణోత్పలుం డనురాజుగలఁ,
డది దంతఘట్టితంబు సేయుట దంతఘట్టకుం డనం దన్మంత్రి గలం, డది పద
పద్మంబున మోపుటం జేసి పద్మావతి యను, నది హృదయంబున నత్తుట
నీవ హృదయేశ్వరుండ, వని సూచించె నప్పుడే నిశ్చయించితి నాకర్ణోత్ప
లుండు ‡కుంతలదేశం బేలుచుండు నని వింటిమి. ౩౦

ఉ. ఆతనిమంత్రికూఁతు ధవదంగనగా నొనరించువాఁడ ర
మ్మా తలపోఁత లేల యని మానవనాథతనూజుఁ గొంచు న
న్వీతనిగూఢవేషముల నేగుచుఁ §కొంతలకంబు చేరి మా
[1]గ్గాతిథివృత్తి నొక్కతె గృహంబున నిల్చి యథాక్రమంబునన్. ౩౧

వ. ఈపురం బేలురా జెవ్వఁ డాతని మంత్రి యెవ్వఁ డాతనికూఁతు రెవ్వరొక్కొ
యింతయు నెఱుఁగుదువే యని యడిగిన నుర్వీశ్వరుండు కర్ణోత్పలుండు
తన్మంత్రివర్యుండు దంతఘట్టకుండు తత్తనయ పద్మావతి యనఁగఁ గలదు
దానికి నే నిష్టదాసినై వర్తింతు నని యది చెప్పిన నాత్మఁ బొంగి

*కనిలిచియున్న బాలికయు. †కనుజాడముననే ‡కళింగదేశం §నేగికళింగపురంబుసొచ్చి
[1]గ్గాతురవృత్తి.

మంత్రిపుత్త్రుఁడు తనమాట నిక్కువమైన, నతని నూఱడించి యదియు యటకు
దూతిగాఁగ మొదలుదొరకొని తమరాక, చెప్పిపుచ్చి రపుడు చెలియకడకు.

క. అది చని యొక రాకొమరుఁడు, సుదతీ నీతలఁ పెఱింగి † సుగుణాత యొందం
గదియఁ జనుదెంచి సమ్మద, మొదవఁగ నాయింట విడిసి యున్నాఁ డనినన్.

వ. అది విని గూఢభావం బేర్పడకుండ దానిని ధర్షించి రోషమిషంబునం గర్పూ
ర మలయజ సాంద్రంబు లగు రెండు చేతుల దాని రెండు చెక్కులం దనపది
వ్రేళు నంట వ్రేసిన నది ఖిన్నవదనయై తిరిగి చనుదెంచి తత్త్రుతాపమానంబు
జూపిన నారాకొమరుం డింక నాశ లే దని యుష్ను రసినం దత్సహచరుం
డగు బుద్ధిశరీరుం డి ట్లనియె. ౩౬

సీ. చింతింప కిఁక దీని చెక్కిళ్లఁ దెలసి పది రేఖలుగ వ్రేసి పంపు టరయ
నిదిశుక్లపక్ష మీపదిదినంబులుఁ బుచ్చి ర మ్మని చెప్పుట నమ్ము మనుచుఁ
దెలిపి యాపదిదినంబులుఁ బుచ్చి యాదానిఁ బ్రార్థించి యొప్పటియట్ల పనుప
నది తోఁటికి యు మాటలాడఁగాఁ గుంకుమనూఱెడి సఖిఁ బిల్చి నోఁ మీఁద
దీని నడుపు మనుచుఁ దెగి మూఁడు వ్రేళుల్ వే, యుంచి వెడలనడిచెవంచనమున
మగిడివచ్చి కుంకుమదత్తాంకితము లౌ, పెట్లు జూపె నది యభీష్టముఖర. ౩౭

గీ. చూచి యాస లేమిఁ ‡ జూకురుఁ బొందుచు, చచ్చుటొప్ప ననుచు వెచ్చనూర్పు
వజ్రముకుటుఁ బొగల వల దని లత్సఖుఁ, డాసగిలుగిఁ దెలిపి దానిఁ బిలిచి.

వ. ఆకన్నియ రజస్వల యై యుండెంబోలుఁ గావున నెత్తుగా నీమూఁడు వ్రేళ్లు
వే యుంచు త్రోలించ నీమూఁడు దినంబులుం గడపి యింక నొక్క తోయంబె
యురుగవలయు నని పెఁడుకొనిన నది యుం గ్రమంబున నాలుగవనాఁడు
కన్యకాసౌధంబునకుం జని మగిడ వచ్చి. ౩౮

మ. నగుమోము మొప్పఁగ నేఁటిమాట వినుచు న్నన్నాదరింపంగ నే
నుఁగు లద్వళి మదించు కంబము వెన న్నుగ్గాడి యొ తెంచిన
న్నాగనల న్నడలంగరా దనుచు నంభోజాక్షి పీఠంబుపై
డిగజాఱ న్ననుఁ ద్రాటఁ గట్టి విడిచెన్ డెందంబు బిట్టుల్లగాన్. ౩౯

క. అనవుడు తన్నారఁబునఁ, జనుదెమ్మను టయ్యె ననుచు జనపతిసుతునిం
గొనిచని యాపిరము పై, నసిపెనలసి మీఁదివార లటు చేఁదుకొనన్. ౪౦

† సుందర మొదవన్ - సుగుణాతిశయమునన్. ‡ సుర్కుకుచుఁ బొక్కుచు.

శా. ఆసాధాంతరసీమ రత్నమయపర్యంకంబుపై నుండి త
ద్దాసీలోకకృతోపచారుఁ డగుచుం దాంబూల పుష్పాను లు
ల్లాసం బంది చెలంగి చేకొనుచు బాల న్నిగ్గుదేఱం బరీ
హాసోక్తిం బరికించి రాకొమరుఁ డేకాంతంబునం బ్రోడమై. ౪౧

క. తలఁపునకుం జెంగను నగ్గల మగుతమకమున బాలఁ గౌఁగిట నిడి మైఁ
బులకలు మొలవఁగ దలకొని, చులుకఁగ రతిసుఖముఁ జవులు చూపుచుఁ గవిసెన్.

ఉ. ఈగతిఁ బెక్కునాళ్ళు సుఖియించుచు నుండి విదేశభూమిలో
నేగతి నున్నవాఁడొ తన యిష్టసఖుం డని యిచ్చలోనఁ జిం
తాగతుఁ డైన దీనికిఁ గతం బిట నేఁటిది చెప్పు మన్న నా
త్మాగమనంబుఁ దన్నతియు నాతని యున్నియుఁ జెప్పె నేర్పడన్. ౪౩

క. అది విని నీకాపుఁడు నా, హృదయస్థితి యెఱుఁగు జాణఁ డీక్రియ దాసీ
సదనమున నొగులుచుండఁగ, నది యేలా చెప్ప వాతఁ డాప్తుఁడు గాఁడా.

క. అతనికి నేం దోసరింపం, జతురుఁడు నను మెచ్చఁ బాయసముఁ బక్వాన్నా
న్వితముగ ఘృతముం గొనిచని, యతిముదమునఁ బెట్టి యింటికరు దెమ్మనుచున్.

సీ. ఆపదార్థములు రయమ్మున సమకూర్చి యాత్రాడు వెంటనే యనుప నతఁడు
చని దాసిగృహమునఁ దన యిష్టసఖుఁ గాంచి బాలిక యిదె పంపెనని చెనవిన
నకట నాయున్కిఁ జెప్పక యుండ వైతివి తమమీఁది చిత్తంబు దరలఁ గాన
నతు లిష్టచెలికాని నైతు రె నాకును విషము వెట్టెది దోడ్డ విందు వనిచెఁ
జావుమనుచు నతఁడు శునకంబునకుఁ బెట్టె, నదియుఁ దినుటతడ వయవనిఁ గూలె
నెదిరివారిచిత్త మెఱిఁగి వర్తించెడు, వారి కేల కీడు వచ్చు నరక. ౪౬

వ. ఇట్లు దృష్టాంతంబు చూపి నీవింక గూఢంబున నేగి యతనికి భోజనంబు పెట్టితి నని చెప్పి మధుపానమత్త యగు నమ్మత్తకాశినికి లోఁదొడ గోరు నాట మూఁడు పోటులు వరుసం బొడిచి పాదభూషణమ్ము గొని రమ్మిటఁ గార్యంబు చూచుకొంద మని యనిపిన నతండు నని యాక్రమం బొనరించి యందియఁ గొని వచ్చిన. ౪౭

శా. అక్కడ మాని తత్పురి యుపాంతమున న్నసనంబులోన గో
రక్షుఁడు మీననాథుఁడు ధరం జరియించుచు విశ్రమార్థ మై
యెక్కడ నిల్చినారో యన సిద్ధులు నద్ధతి సిద్ధవేషు లై
యొక్కమఠంబు గట్టుకొని యుండిరి శూలము కేలఁ గ్రాలఁగన్. ౪౮

క. ఒకనాఁ డటు కర్ణోత్పలు,నికొడుకు మృతుఁడైన నెఱిఁగి నీతివిదుఁడమం
త్రికుమారుఁడు నృపసుతుచే,తికి నూపుర మిచ్చి యంతఁ ద్రిప్పఁగఁబనిచెన్.

క. అమ్మెద నని చూపుము తెగ, నమ్మకు మఱి దీనిజాడ లడిగిన నీచి
త్తమ్మునఁ గలఁగక నా కీ, సొమ్మిచ్చెను గురుఁ డటంచుఁ జూపుము నన్నున్.

సీ. అనవుడు నాఁగాక యని పురంబున కేగి యంగడి నమ్మఁజూపంగ నొకతె
మనపాప సొమ్మని మంత్రికిఁ జెప్పిన నాతఁడు సొమ్ముతో నతనిఁ బట్టి
పృథివీశుముందఱఁ బెట్టినఁ గలుషించి చెప్పరా యిది యెట్లు చేరె ననిన
నే మ్రుచ్చుఁగాను మీ కీజాడఁ జెప్పెద బంటుల నా వెంటఁ బనుపు మనుచుఁ
గొందఱా రేకులను దోడ్కొనుచువచ్చి, నాకుసొమ్మిచ్చెనీగురునాథుఁడనుచుఁ
జూప వారలుమదిఁ గడుఁజోద్యమంది,యట్టి వేషంబునకు సంశయంబునొంది.

క. ఓగురునాయక యీ సొ,మ్మేగతి నినుఁ జేరెఁ జెప్పనేతె మ్మనినన్
జోగులము మేము మాకట, రాఁగూడదు గాన రాజ రమ్మనుఁ డటకున్.

క. అతనికిఁ జెప్పెద మనవుడు, నతివేగమ యేగి వార లటు వినిపింపన్
క్షితిపతియును మఱి నతివి,స్మితుఁడై చను దెంచి కపటసిద్ధుని మ్రోలన్.

క. వినతుఁడై యున్న యాతని, గనుఁగొని నీవీట దంతఘట్టకుసుత డా
కిని వై యీమసనములో,నను రాత్రులు దిరుగు నది దిగంబర యగుచున్.

క. ఈరాత్రి నీకుమారుని, మారిమసఁగినట్లు చంపి మలయఁగ నేనా
ఘోరాతిశూలనిహతిఁద,దూరుస్థలి నొంచి చరణ మొడియఁగ నెగసెన్.

క. కాలు విదిర్చిన నందియ, కీలెడలినఁ బుచ్చుకొంటి క్షితినాయక యే
స్త్రీలను జంపరు గావున, నాలలనను వెడలననుపు మంతియ చాలున్. ౧౬

క. అనవుడు వెరఁగంది భయం,బున మంత్రితనూజసౌధమున కంగనలం
బనిచి తొడపైఁ ద్రిశూలం, బునఁ బొడిచిన యట్టులున్న*పోటులు దెలిసెన్.

గీ. తెలిసి శోకరోషకలుషుఁడై యారాజు, మగిడి పురికి నేగి మంత్రి కూఁతు
దయ్యమనుచుఁ బ్రజలుదలఁకఁగా వెడలఁగొ,ట్టించెఁజాడనిదిక డిందియనుచు.

శా. ఆకన్యామని దుఃఖమూలమునఁ బ్రాణాంత్యంబు చింతింపఁగా
నాకాశీపురరాజపుత్రకుఁడు వ్యక్తాకారుఁడై తన్నన
శ్శోకం బార్చుచు †పెద్దజోగిఁ దనయిష్టుంగా నెఱింగించి య
స్తోకం బౌ నిజరాజ్యముం దెలుపుచుం దోడ్కొంచు నేగెం బ్రియన్. ౧౭

*భూపతితెలిసెన్ †వేద్యజోగి.

క. తదనంతరంబ యొక నా,ల్గుదినములకు దంతసుట్టకుఁడు సతియును దా
మదిఁ *గూఁతుశోకదహనము, పొదివినఁ బరలోకమునకుఁ బోయెం బెలుచన్.

క. ఆపాపము గడపటఁ గా, శీవతిపుత్రుండో యతని చెలికాఁడో యీ
భూపాలుఁడో వీరలలో, నేపురుషుం డొందుఁ జెప్పు మెఱిఁగినకొలఁదిన్.

సీ. ఎఱిఁగి చెప్పకయున్న నిప్పుడే నీతల పది వ్రక్కలై పడు నిది నిజంబు
కావునఁ జెప్పుమా నావుడు నిఁక నూరకుంట మోసం బని యుర్వీవిభుఁడు
కామాతురుం డౌచుఁ బ్రేమ రాకొమరుఁను †తనపనిఁగాఁ జేసికొనుట తగవు
సచివసూనుఁడు నిజస్వామికార్యమునకు మర్మంబు సేయుట ధర్మపథము
తలవరుల చేత వానివర్తనము లెల్ల, మొదలఁ దెలియక యదినిజంబుగఁ దలంచి
చేసెఁగావున దురితంబు చెందుఁ బ్రభుని, రాష్ట్రకృతమైన పాపంబు రాజుఁ బొందు.

క. అనవుడు బేతాళుఁడు స,మ్మనమునఁ గొనియాడి యతని మౌనత్యాగం
బున నిలువక యెగసి రయం,బునఁ జని తరుశాఖఁ దగిలెఁ బూర్వస్థితితోన్.

వ. ఇట్లు విడిపించుకొని పోయిన. ౬౪

క. ఆనరపతి క్రమ్మఱఁ జని, పీనుఁగు క్రియ వీఁపుమీఁదఁ బెట్టుకొని చనం
గా నొకకథ నెపమున స,మ్మానము విడిపించి యతఁడు మగుడం బాఱెన్.

వ. ఇట్లు మొదలికథంబోలె సారెసారెకుం గథలు చెప్పి మఱుఁగులైన సదుత్తరంబు లందుచుం బరికించుచు నిరువదియేనుమాఱులు దాఁక రాకపోకలనలయించి యతని వివేకంబునకు స్థిరోద్యోగంబునకుం బరిణమించి బేతాళుండు మే లొనగూర్పం దలంచి. ౬౬

క. నరనాథ సర్వలక్షణ,పరిపూర్ణుఁడ వంచు నిన్ను బలిసేయ మదిం
బరికించి కపటభిక్షుకుఁ, డరుదుగ ననుఁ దోడి తేర ననుపుట గంటే. ౬౭

గీ. నన్నుఁ గొంచు నేగ నిన్ను నుసాష్టాంగ, మెఱఁగుమనిన మ్రొక్క నెఱుఁగఁ దొల్లి
నేఁడు నిన్నుఁ జూచి నేర్చెద నిప్పుడు, మ్రొక్కి చూపు మనుము మోసపోక.

క. ఇటు మ్రొక్కుమనుచుఁ జాఁగినఁ, దటుకున నడిదమున వాని తల ద్రెంచి సము
త్కట మగు వనలములో నొ,క్కట వైవుము సిద్ధు లెల్ల ‡గతివడు నీకున్.

చ. అనవుడు నట్ల యియ్యకొని యాతని మూఁపునఁ బెట్టుకొంచు ద
చ్చిన మది మెచ్చి వాఁడు మును సెప్పిన రీతిని మ్రొక్కుమన్న నే

* గూఁతుశోకదహనంబున † తనదానిగా ‡ గనఁబడు.

రని క్రియఁ బల్కిన న్నతి ధరం బ్రణమిల్లిన వాని మస్తకం
బనువునఁ ద్రుంచి పావకున కాహుతిగా నొనరించి సిద్ధుఁ డై. ౨౦

గీ. ఆత్మరక్షణార్థుఁ డగు వాని నటు వేల్చి, యంత భూతనాథుఁ డతని మెచ్చి
యెవ్వఁడైనఁ దలఁపు మే వచ్చి నిల్చెద, సిద్ధు లెనిమిదియును జెందు ననియె.

క. సురలటు పేర్కొని విద్యా,ధరరాజ్యము గలుగ నొసఁగి తద్గుణముల క
చ్చెరువందుచు నేగిరి భూ,వరుఁడును బేతాళు ననిపి వచ్చెం బురికిన్.*

శా. ఈసామర్థ్యము నేర్పుఁ దెంపు నణిమాదీశత్వము న్లేక నీ
కీసింహాసన మెక్క రాన మదిలో నీక్షింపు మా యన్న ను
ల్లాసం బెల్లఁ దొలంగి తద్గుణగణశ్లాఘాపరుం డౌచు ల
జ్జాసంగవ్యథఁ గ్రమ్మఱం జనియె భోజక్ష్మాధిపుం డింటికిన్. ౨౩

— ముప్పదిరెండవబొమ్మకథ. —

క. తదనంతరంబ యా ము,ప్పదిరెండవబొమ్మ యొకఁ బద మిడు మని స
మ్మదమున నిఁకఁ బల్కెఁ గునని, మదిలోఁ దలఁ దలఁచి యతఁడు మఱునాఁ డెలమిన్.

క. సన్మునిహృదయారాధితుఁ, జిన్మాత్రుఁ గృపావిశేషు శేషాభరణు
న్మన్మథమదగజకేసరి, జన్మజరామృత్యురహితు సర్వేశ్వరునిన్. ౨౫

క. డెందంబునఁ దలఁపుచు నం,క్రందనమణిపీఠ మెక్కఁ గడఁగెడు నెడ నా
కందువ నిలిచిన బొమ్మ వ,సం దిన్నని నగవుతోడ జనపతిఁ బలికెన్. ౨౬

చ. వలదన నేల యిట్టి దురవస్థలఁ బొందఁగ నేల నీకు భూ
తలమున విక్రమార్కుగతి ధర్మము సత్యము సాహసంబు ని
శ్చలముగ నిల్ప లేని మనుజప్రభుఁ డీదెస మెట్టఁ జూచినం
దలఁపులు నిష్ఫలంబు లగుఁ దత్త్వ మెఱుఁగని బుద్ధి నిన్నిటన్. ౨౭

చ. అతని గుణక్రమం బెఱుఁగు మర్త్య భుజాబలభీమసేనుఁ డా
తతరణకౌశలార్జునుఁడు ధర్మయుధిష్ఠిరుఁ డార్తరక్షణా
చ్యుతుఁడు కృపాదిలీపుఁ డరిసూదనభార్గవుఁ డర్థబోధవా
క్పతి విభవామరేంద్రుఁ డనఁగా నతఁ డుజ్జయినీపురంబునన్. ౨౮

చ. క్రతువు లనేకము ల్నడిపి గౌరవ మేర్పడ నుర్వి సప్తసం
తతులును నిల్పి వేదనిసదంబులు విప్రగృహంబులందు నం

* ఈకందమునకు మాఱుగా, వ. అనిన నట్లు విక్రమార్కుండు సంకల్పసిద్ధుండయ్యెఁ గావున- అని యొక ప్రతిలోఁ గలదు.

తతము( జెలంగ దీను లతిదానముల న్నగడంగ ధర్మసం
గతి మెఱయించె రాజవవికారము లెవ్వియు( జెందకుండఁగా. ౨౯

చ. కఱవులపే రడంచి యుదకంబుల నెవ్వఁడు వర్ణవాక్కృతిం
జెఱువులు నింపియుండ( దమసీమల( దప్పక నాల్గుజాతులుం
దఱచుగ ధర్మము ల్నెఱప(*దస్కరజాతుల నప్రమత్తత
న్నెఱయఁగనీక సజ్జనులు మెచ్చ(గ శాశ్వతకీర్తికాము( డై. ౩౦

ఉ అంబుజమిత్రు వంశ మని యార్యులు సన్నుతి సేయఁగా సము
ద్రంబులు నాల్గుమేర లగు ధారుణి యంతయు నేలుచుం బత్రా
పంబున రాజు లెల్ల( దన పంపు చరింపుచు( గొల్వ( గార్యఖ
డ్గంబుల నైరులం దునిమె గట్టిగ సత్యము నిల్పుకోరికిన్. ౩౧

సీ. సత్త్వంబునన మహాశ్చర్యంబుగా గెల్చి వసుధేశులను వాత్మవశుల( జేసి
వరరత్నకనకాది వస్తువు లన్నియు( దనసొమ్ముగా( జేసికొని యతండు
హయమేధములు మొదలైన యాగములందు(గూడి దేవతలెల్ల(దోడుపడ(గ
బడుగులు వేఁడిన( బ్రాణంబు లైనను వంచింప కొనఁగెడు వ్రతము పట్టి
సర్వదిక్కులందు( జాటించి యర్థుల(, గూడ( దిగిచి వారు గోరినట్ల
యూళ్ళు నర్థమును యథోచితంబుగ నిచ్చి, శాసనంబుగాఁగ శక మొనర్చె.

వ. భువిలో నభూతపూర్వంబు నద్భుతంబు నగుకృత్యంబు శకం బనంబడు(
దొల్లి జరుగు శ్రీరామశకంబు యుధిష్ఠిరశకంబు నణంచి నిజశకంబు నిల్పిన
నందానందాది సంవత్సరాద్యమ్మున విక్రమార్కశకంబై చతుర్లక్షజ్యోతి
శ్శాస్త్రగతిప్రవర్తకం బయ్యె ౩౩

గీ. నడుమ శాలివాహనశకంబు గలిగియు(, జెడక యుత్తరమున( బుడమిలోన
నెన్నిచూడ( బదియు నెనిమిది వేలేఁడు, లతనిశకము రూఢిపలర(గలదు. ౩౪

క. ఈపాటి మహిమ గుణములు, నీపాలం గలిగె నేని నేఁ డక్కు వృథా
టోపంబులు పల దని యో, త్మాపాలక నిన్ను మాన్ప( జలమో ఫలమో.

క. అని చెప్పి మఱియు నాతని, మన మలరఁగ( బలికె నిన్నిమాటలు మానే
ర్పున నతనిమహిమ కొలఁది, †న్వివరింపించితి మింతె కాక నీవల్పుఁడవా.

క. నరనారాయణులనఁగాఁ, బరఁగెడు హరిమూర్తు లుర్వి ఫల్గునదామో
దరులై పుట్టిరి నాఁ డా, నరుఁ డతఁడై పుట్టినాఁడు నరవరతిలకా. ౩౭

* దస్కరజాతుల † వినిపించిననింతసేమ.

క. ఈకలియుగమున విద్యల, కేకడఁ జేపట్టు లేమి యెఱిఁగి పలికి వా
ణీకాంతుని వినిపించిన, నాకమలభవుండు సెప్పె నచ్యుతుతోడన్. ౮౮

*గీ. అచ్యుతుండు విద్యలైశ్వర్యమునఁ గాని, మెఱయ వనుచుఁ జెప్పి యొఱుఁగఁ గలుగ
నరునిఁ బుట్టఁ బంచె నరపతిత్వము గోరి, యతఁడు నవని నీవయై జనించె.

క. నరునకు నారాయణునకు, నరయఁగ భేదంబు లేదు హరి యొక్కఁడు న
య్యిరువురయీ వగుఁ గావున, నెరవుగఁ బరికింప నీవ విష్ణుఁడ వనఘా.

క. ఈపుణ్యుని నినుఁ జూచిన, పాపావధి గలిగెఁ గల్మషం బణఁగెఁ గులో
ద్ధరక! "నావిష్ణుః పృథివీపతి" యనుకీర్తి నీకు విహితం బయ్యెన్. ౯౧

చ. అన విని చోద్యమంది వసుధాధిపుఁ డప్పటి శాపకారణం
బానరఁగఁ జెప్పు మెవ్వ రని యుత్సుకుఁడై తను వేఁడినం గ్రమం
బున నది క్రమ్మఱం బలికె భోజనృపాలక! పార్వతీసఖీ
జనులము నేము దేవి కనుసన్నల దగ్గఱి కొల్తు మెప్పుడున్. ౯౨

క. ఒకనాఁ డేమును నయ్యం,బికయును విశ్రాంతి కేగి శుకపికభృంగ
ప్రకరవరితోషకర మగు, నొకవనమున విరులు గోయుచున్నెడ వేడ్కన్.

సీ. కన్నుల విని గాలిఁ జెన్నొందు నందియ యనుగుఁదమ్మికి బెడఁగడరఁ జేయు
నందిని నులికించు పెందోలు హరాంబట్టుకైవడి నునుపారఁ గాసెవోసి
తలఁచినయంత నె వలపులఁ దలకొల్పు వెలిపూఁత మేనెల్లఁ గలయఁబూసి
జక్కవకవ కెదురెక్కుడా రేవెలుఁ గెలమితో జపలపై వెలుఁగుచుండ
విసము మెడనుండియును దీప్తి వెలికిఁదోఁపఁ, గేలశూలంబు ఫణిపతిలీల మెఱయ
మిండజంగమైయామంచుఁగొండకూఁతు, నెదుటికరుదెంచె ముక్కంటిచమురులాఁడు

క. ఆచందము గనుపట్టం, జూచిన యావేళ మనసిజుఁడు మమ్ముఁ దెగం
జూచి తనకమ్మఁదూపుల, మాచిత్తములెల్లఁ గరఁచె మానము లెడలన్.

క. పులకించెఁ జెక్కు లలికం, బుల లేఁజెమరొత్తె నధరముల నదరొదవెన్
వలువల గనయము లూడెం, †బలుకమఱచియుఁ టిమేము ప్రతిమలమాడ్కిన్.

క. ఆలతి నయ్యంబిక మా, చేతోగతు లెఱిఁగి కనలి చెలిమికి వెలిగా
భూతలమునఁ ‡బుత్రళు లై, చైతన్యము లుడుగుఁ డనుచు శాపంబిచ్చెన్.

---

* అచ్యుతుండ విద్యలైశ్వర్యమునఁ గాని, మెఱయ వనుచుఁ జెప్పి యొఱుఁగఁ గలిగి
ధారుణిఁ బుట్టఁ బంచె నాహరియిప్పుడు నీ, వైజనించినాఁ డవవనిపాల.

/ దీప్తి † బలుకకమఱచియుంటిమేము ‡ బుత్రికలై.

ఉ. ఆక్రియ శాప మిచ్చిన భయంబున నందఱ మాత్మ లజ్జ ర
త్నాక్రియనన్ని పాత ముకుగంబకు నైవశిఁ గామనిక్రియా
వక్రమ మానసం దెలిసి పార్వతికిం బ్రణమిల్లి తల్లి మా
కేక్రియ శాపమోక్ష మగు నింత దలంచుట మాతృకృత్యమే! ౯౮

మ. అనుచుం బ్రార్థన చేసిన న్వని కృపాయత్తాత్మయై మీరు కాం
చనపాంచాలిక లై జనించుఁ డొక ప్రస్తావంబునం బుణ్యవ
ర్తనునిం జెప్పఁగ వాక్యసిద్ధి యగుఁ దత్కాలంబు మీశాపమో
చనమౌఁ బొందని పీడుకొల్పిన మనస్తాపంబునం బిమ్మటన్. ౯౯

వ. ఒక్క మాతే భూలోకంబునకు రానోడి, మాసంప్రార్థన విశ్వకర్మనిర్మితం బగు నయ్యింద్రసింహాసనంబున నున్నుండి పదంపడి భూమికి వచ్చి యాయుత్తమ నాయకు గుణకథనార్థమై నిన్నిన్నిమాటలు వారించితిమి. నాపేరు శృంగారతిలక యనం బరఁగు, పీరలు జయయు ను, విజయయు, మలయావతియు, ననంగసంజీవనియు ను, గంధర్వసేన యుఁ, బ్రభావతియు, సుప్రభయు, సంభోగనిధియు, సుభద్రయుఁ, జంద్రికయు, కురంగనయనయు, ననంగధ్వజయు, నిందువదనయు, విలాసరసికయుఁ, గోమలియు, సౌందర్యవతియు,లావణ్యవతియు, లజ్జావతియు, నిందుమతియు, జనమోహినియును, విద్యాధరియు, హరిమధ్యయు, సుఖప్రదాయినియుఁ,బ్రబోధవతియు, మలయవతియు, హంసగమనయు, నంగసుందరియు, సుకేశియుఁ, జతురికయు, వామాంగియుఁ, దలోదరియు, *నను పేరులు గలవా రని యెఱుంగు మిట్టి మేమును- ౧౦౦

క. బొమ్మల మై యానుణిపీ,ఠమ్మున బహుకాలముండి డస్సితి మని చి
త్తమ్ములఁ బొగులఁగ మాభా,గ్యమ్మున నీతోడ మాట లాడంగలిగెన్.

క. కష్టంబు వీడె నీకే,యిష్టం బని వేఁడు మిప్పు డిచ్చెద మనినన్
సాష్టాంగ మెఱఁగి భోజుఁడు,హృష్టుండై పలికె వారిహృదయము లలరన్.

క. మీకృప సంపద లన్నియు, నా కుండఁగ నేమి ప్రార్థనము భవదీయా
లోకము గలిగెను బుణ్య,శ్లోకుఁడ నైయుండఁ గంటి లోకులు పొగడన్.

క. అని వినయోక్తులు పలికినఁ, గొనియాడుచు నిలిచి రాజకుంజర నీచే
సిన యుపకారమునకు నే, మని ప్రత్యుపకృతి యొనర్ప న్వచ్చును మాకున్.

---

* మనోహారియు, మానవతియు, పద్మపాణియు, నీలవేణి, శుకవాణియు, పులినశ్రోణియు, నిరుపమయు నను పేరులు ప్రత్యంతరములలో నున్నవి. వీనింజేర్చిన 32 నకు మించినవి.

చ. సకలకళాప్రవీణుఁడవు సజ్జనరక్షణదక్షుండ వం
ధకరిపుభక్తిశీలుఁడవు దానవినోదివి సర్వభావభా
వకుఁడవు విష్ణుమూర్తివి దివానిశముం గవిపాలకార్థిగా
యకనుతిశాలి వుర్వీపతి వల్లుఁడ వా భువి భోజభూవరా! ౧౦౫

శా. నీ కేవాంఛయు లేకయున్న వినుమా నిన్నవ్వఁ డీక్షించిరన్
మాకిష్టంబు సరస్వతీవిభవ మామర్త్యుండు వేపొందు, వా
క్ప్రౌఢుండై విలసిల్లఁ జేసెదము భూపాలాగ్రణీ నీయశం
బాకల్పంబుగ నొప్పఁగాత జనలోకానందమై సాంద్రమై. ౧౦౬

సీ. కన్ను లయ్యెను బండికన్నులయ్యెను జంద్రసూర్యులెవ్వనికడసొంపుగనిరి
సుతుఁడయ్యెరథముపైసూతుఁడయ్యెనుసురజ్యేష్ఠుఁడెవ్వనికడశ్రేష్ఠుఁడయ్యెఁ
దల్పంబునయ్యె నాకల్పంబు నయ్యె నాగేంద్రుఁ డెవ్వనికడ నెన్నఁబడియెఁ
బదమయ్యె మస్తకాస్పద మయ్యె నాకాశమధ్య మెవ్వనికడ మహిమకెక్కె
నట్టి యుభయమూర్తి హరిహరనాథుండు, దేవదేవుఁ డిష్టదైవ మగుచు
నెరయఁ బ్రోచుఁగాత నీకొల్వువారల, భూజనేంద్రభూజ భోజరాజ. ౧౦౭

క. పర్యాప్తంబుగఁ గథ లీ, మర్యాద న్విన్నయట్టి మానవునకు నా
దార్యంబును దెగువయుఁగాం, భీర్యమ్మును బ్రియమునయముఁ బెంపునహించున్

మ. అని దీవించి యుమాసఖీజనులు దివ్యాకారసంపత్తి సొం
పున నాకాశమున న్మెఱుంగులక్రియం బొల్పారునుల్లాసనం
జనితప్రౌఢవచోవిలాసముల నాశ్చర్యంబు రెట్టింప నా
జనులెల్లం దముఁ జూడఁగాఁ జనిరి భోజశ్రేష్ఠు నగ్గించుచున్. ౧౦౯

శా. భోజేంద్రుండును నైక్కరాయి హృదయాంభోజంబులోఁ గాంచి ని
ర్వ్యాజం బైవిలసిల్లు యత్నమున విద్వత్సన్నిధిన్ దానిపైఁ
దేజోమూర్తిఁ ద్రిలోకవంద్యుని *మహాదేవు న్నను న్నిల్పి త
త్పూజాలబ్ధ వరప్రసాదమహిమన్ భూమండలం బేలఁగన్. ౧౧౦

శా. సద్యోనిర్ణయవాదులు న్సరసులు †న్సంగీతకావ్యక్రియా
విద్యావంతు లనంతశిల్పరచనావిజ్ఞానులు న్సర్వసం
పద్యోగ ప్రథమానకీర్తియుతులు న్భామామనోరంజనా
హృద్యాకారులుఁ బుణ్యవర్తనులు నై యేపారి రుర్వీజనుల్. ౧౧౧

---

* మహాదేవున్నిలువున్నిల్పి. మహాదేవుం దగన్నిల్పి † సంగీతవాద్యక్రియా.

మ. అనుచుం జెప్పిన నద్రిజాత మిగులన్ హర్షించి యోదేవ యే
నును బూర్వంబునఁ గొంత వింటిఁ బిదప న్నాత్మప్రసంగంబున
న్వననింపొగతి నేఁడు విస్తరముగా వింటి న్మహావీరుఁ డా
తనిసామర్థ్యము నీప్రసాదమునఁ జిత్రం బయ్యె మృత్యుంజయా. ౧౧౨
క. *నాకోరిన కథలెల్లను, నేకతమునఁ దెలియ నానతిచ్చితి దేవా
యీకలియుగపర్యంతం, బీకథలు ప్రసిద్ధి కెక్కు నిట నీకరుణన్. ౧౧౩
మ. ‡అని యీరీతి నుమామహేశులకు సాంద్రానందసంధాననై
విననిం పై కవిసమ్మతప్రఖ్యాత మై విద్వన్మనఃసద్మజీ
వన మై పావన మై మహాసనకథాద్వాత్రింశి కర్ణామృతం
బన నెల్లప్పుడుఁ జెల్వఁగాత భువిలో నాచంద్రతారార్కమై ౧౧౪
శా. అంభోరాశిజలప్రపూర్ణవిమ్మృతివ్యాసక్తచిత్తాంబుజుం
గుంభీసంభవముఖ్యసర్వమునివాగ్గుంభస్తుతారంభునిన్
జంభారాతిసమీహితాయసమహాస్తంభాంతసంభూతసం
రంభాటోపవిదారితారివరుఁ బ్రహ్లాదప్రతిష్ఠాపరున్. ౧౧౫
శా. బాణాగారముఖాభిరక్షణగుణప్రారబ్ధయుద్ధక్రియా
క్షీణోపేంద్రసుహృత్త్వకృత్యుని దృఢాంగీకారసన్మానిగీ
ర్వాణాధీశసమర్చితాంఘ్రియుగళు న్వామాంగవిన్యస్తశ
ర్వాణీమగ్నమనోంబుజుం ద్రిభువనావష్టంభునిన్ శంభునిన్. ౧౧౬
మాలిని. నవహిమకరజూటా నందితామర్త్యకూటా
జవనవృషభవాహా శంఖచక్రాంకదేహా
ధవళనిజశరీరా దానవధ్వంసకారా
శివమురరిపురూపా శిష్టదృష్టస్వరూపా. ౧౧౭
గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశస్థూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొలని వెన్నయామాత్య పౌత్ర హరితసగోత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బయిన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు బేతాళహరణంబును, బద్మావతియితిహాసంబును, విక్రమార్కుని యుష్టప్రసిద్ధిసంసిద్ధియుఁ దన్మహాసామర్థ్యంబును, బొమ్మలశాపగమనమోక్షప్రకారంబును దదీయ నిజస్వరూపప్రాప్తియు నన్నది సర్వంబును ద్వాదశాశ్వాసము.

---

* నాకోరినకోలఁదినియా, ‡ అనుచుఁజాగ్రిత్తజటిసఁ గావున సోందాంకందసంధానమై త్రిభువనవ్యాపారపారీణునిన్.